# శ్రీమన్నారద
# భక్తిసూత్రములు

' వార్థ దీపిక

శ్రీ శ్రీ శ్రీ
సీతారామ యతీంద్రులు

## కృతజ్ఞతాంజలి

ఆధ్యాత్మిక కార్యాలకు తమ సంపదను వెచ్చించటం అవశ్య కర్తవ్యమూ, సార్థకమూ అన్న విషయాన్ని సంపన్నుల్లో, చాలామంది విస్మరించిన ఈ దినాల్లో, ఈ పుస్తక తృతీయ ముద్రణానికైన వ్యయం భగవదర్పణంగా సమర్పించి మార్గదర్శకులైన శ్రీమాన్ మాడభూషి సింహాద్రి అప్పలాచార్యుల వారికి - కాకినాడ- మా హార్ద కృతజ్ఞతాంజలి !

— ప్రకాశకులు.

# సంపాదకీయము

శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యులు శ్రీ శ్రీ శ్రీ సీతారామ యతీంద్ర గురుదేవులు అనుగ్రహించిన నారద భక్తిసూత్ర సంక్షిప్తవ్యాఖ్య - భావార్థ దీపిక - తృతీయ ముద్రణము - సాధకుల కర కమలాల్లో సమర్పిస్తున్నాం. ఈ అవకాశం కలుగచేసిన సోదర సాధకులకు కృతజ్ఞత తెలుపుతూ, ఇతోధికంగా దీన్ని ఆదరించి భగవద్భాగవతాచార్య కృపా పాత్రులు కాగలరని ఆశిస్తున్నాం.

— సంపాదకుడు.

# పరిచయము

వ్యాస వాల్మీకి సుతీనాం
ముక్తిమార్గోపదేశకం
పరమైకాంతిక శ్రేష్ఠం
నారదం మద్గురుం భజే।

నారదమహర్షి వ్యాస వాల్మీక్యాదులకు కూడ ఆచార్యుడు. ప్రహ్లాదుడు, ధ్రువుడు మొదలైనవారిచే భక్తిపీయూషమును కుత్తుకబంటిగ గ్రాగించి, వారిని మహాభక్తాగ్రేసరులనుగా చేసిన గురుదేవుడు. దేవర్షి యైన ఈ నారదమహర్షిచే ప్రసాదింపబడినవే ఈ భక్తిసూత్రములు. పందొమ్మిది వందల ఇరువది ఏడవ సంవత్సరమున భగవత్కృపచేత నాకీ సూత్రములు లభించినవి. అప్పటినుండి ఈసూత్రములను భక్తిశ్రద్ధలతో నిత్యము పారాయణ చేసికొనుచుంటిని.

పందొమ్మిది వందల నలువది అయిదవ సంవత్సరమున తెంపల్లె గ్రామమున నలుబదిరోజులు ఎడతెగని

భగవద్విషయ కాలక్షేపము జరిగినది. ఆ రోజులలో శ్రీ మిట్టపల్లి చంద్రశేఖరరావుగారు ప్రతిరోజు ఆంజనేయస్వామివారికి ప్రదక్షిణములు చేయుచు, దీక్షగా గీతను పారాయణము చేసెడివారు. శ్రీనందూరి సుదర్శనముగారు దీక్షగా గీత పదునెనిమిది అధ్యాయములు పారాయణము చేయుచు, శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణము- మందరముతో కూడ- పురాణ కాలక్షేపము చేయుచుండెడివారు. ఆ సందర్భములో వారిద్దరు ఈ భక్తిసూత్రములను ఉపదేశము పొందెద, అర్థముకూడ తెలుపవలసినదని కోరిరి. అప్పుడు వారి కోరికపై ఒక రోజులోనో, రెండు రోజులలోనో సంక్షిప్తముగా సూత్రముల భావార్థమును వారికి శ్రవణము చేయించగా, ఎప్పుడు చెప్పినదప్పుడు వారు వ్రాసి యుంచుకొనిరి. అదియే ఇప్పుడు ఈ భావార్థ దీపికగా మీ కరముల యందున్నది. పరమాత్మ కరుణచేత అచిరకాలముననే విపుల వ్యాఖ్యానము ప్రచురింప బడగలదు.

— సీతారామయతి.

# స్తోత్రము

భక్తావతంస మకుటం భవసాగర తారకమ్
తాపత్రయహరం ధీరం తత్త్వ విద్యా ప్రదాయకమ్

కల్యాణగుణ సంపన్నం కరుణాపాంగ వీక్షణమ్
అజ్ఞాన తిమిరాదిత్యం హరిభక్తి ప్రబోధకమ్

శమాది షట్క సంయుక్తం అరిషట్కవిదారకమ్
శ్రీకృష్ణ భజనానందం సేవకాభీష్టదాయకమ్

సంపత్కుమార సచ్ఛిష్యం కృష్ణాశ్రమ నివాసినమ్
సీతారామ యతీంద్రాఖ్యం మద్గురుం సముపాస్మహే !

యో యామ్యేన కరాంబుజేన మహతీం
వీణాం గృహీత్వా ముదా
ధృత్వా వామకరేణ తాళ మనిశం
నారాయ ణాష్టాక్షరమ్
గాయ న్మంగళ మంత్రరాజ మమలా
నందాశ్రు నేత్రో ముహుః
నృత్య త్యచ్యుత పాదభక్తి వివశః
త న్నారదం భావయే !

పుంజీభూతం ప్రేమ గోపాంగనానామ్
మూర్తీభూతం భాగధేయం యదూనామ్
ఏకీభూతం గుప్త విత్తం శ్రుతీనామ్
శ్యామీభూతం బ్రహ్మ మే సన్నిధత్తామ్ !

ఓం శ్రీ పరమాత్మనే నమః

# శ్రీమన్నారద భక్తిసూత్రములు

## ప్రథమాధ్యాయము

### అవతారిక

నారదమహర్షి గురువులకు గురువు - సర్వజ్ఞులు. ఆధ్యాత్మిక విద్య - ఎప్పుడు ఎవరు ఏమి ప్రతిపాదించినను దానికి ఆది బోధకులు శ్రీ నారదమహర్షియే. ఆధ్యాత్మికములగు అనేక మార్గములనుగూర్చి ప్రసంగించి, అవేవియు కేవల ముక్తిమార్గములు కావనియు, మీదు మిక్కిలి అవి అపాయములతో కూడుకొన్నవి కూడ అనియు విమర్శించి, నిరపాయము సాక్షాన్మోక్షోపాయము అగు భక్తినిగూర్చి ప్రతిపాదించు ఉద్దేశముతో ఈ సూత్రములను ఆరంభించుచున్నారు శ్రీ నారదమహర్షి :

## ౧. అథాతో భక్తిం వ్యాఖ్యాస్యామః

వెళ్ళ ఇతర విషయములను గురించి ప్రసంగించిన అనంతరము, అవేవియు పరమ పురుషార్థమగు మోక్షమునకు సాక్షాత్తుగ సాధనములు కానందున, మోక్షమునకు సాక్షాత్తుగ సాధనమును, నిరపాయమును అగు భక్తినిగూర్చి వివరించుచున్నాము.

## ౨. సా త్వస్మిన్ పరమప్రేమరూపా

పరిపూర్ణ సనాతన పరబ్రహ్మ తత్త్వమునందు పరమ ప్రేమయే - అంతులేని ప్రేమయే - భక్తి అనబడును.

## ౩. అమృతస్వరూపాచ

ఆ భక్తి అమృతస్వరూపమైనదికూడ. అమృతమనగా నశించనిది అనియు, మధురమైనది అనియు, ముక్తిస్వరూపమైనది అనియు కూడ అర్థముకలదు. భక్తికి నాశము లేదు. ఆచరించునప్పుడు మధురమైనదిగా కూడ ఉండును. అదియే ముక్తి స్వరూపము కూడ.

౪. యల్లబ్ధ్వా పుమాన్ సిద్ధో భవ
త్యమృతో భవతి తృప్తో భవతి

అట్టి భక్తిని పొందిన మానవుడు సిద్ధుడగుచున్నాడు. ముక్తుడగుచున్నాడు- అనగా జనన మరణ రహితుడగుచున్నాడు. తృప్తుడగుచున్నాడు.

౫. యత్ప్రాప్య న కించిద్వాంఛతి న శోచతి
న ద్వేష్టి న రమతే నోత్సాహీ భవతి

ఆ భక్తిని పొందిన తరువాత మానవునకు కించిన్మాత్రమును కోరిక ఉండదు. ఏవిధమైన దుఃఖమును ఉండదు. అతడు ఏ భూతమును ద్వేషించడు. విషయోపభోగములం దేమాత్రమును ఆసక్తి పొందడు. ప్రాపంచికములైన లాభములకు సంతోషమును పొందడు.

౬. యజ్జ్ఞాత్వా మత్తో భవతి
స్తబ్ధో భవత్యాత్మారామో భవతి

అపార ప్రేమస్వరూపమైన ఆ భక్తిని అనుభవములోనికి

తెచ్చుకొనిన మానవుడు ఉన్మత్తుడగును. జడతలేకయే జడుని వలె నుండును. తన కాత్మయైన పరమాత్మయందే ఆనందించు చుండును.

## ౭. సా నకామయమానా నిరోధరూపత్వాత్

ఆ భక్తి కోరికలకు అనుకూలించదు - ఏలఅనగా కోరికలను నిరోధించుటయే స్వరూపముగా గలది భక్తి.

## ౮. నిరోధస్తు లోక వేద వ్యాపార న్యాసః.

నిరోధమనగా లోకసంబంధ మైనట్టియును, వేదసంబంధ మైనట్టియును సమస్త వ్యవహారములను పూర్తిగా విడచుటయే.

## ౯. తస్మి న్ననన్యతా, తద్విరోధి షూదాసీనతాచ

సచ్చిదానంద ఘన పరిపూర్ణుడైన పరమాత్మయందు అనన్యత్వమును - అనగా ఎంతమాత్రమును ఇతర భావనలు లేక, తైలధారావిచ్ఛిన్నముగ, మనస్సును పరమాత్మయందుంచు

టయును, అందుకు ప్రతికూలములైన ప్రాపంచిక విషయము లందు జోక్యము లేకుండుటయు కూడ అని తెలియవలెను.

## ౧౦. అనన్యాశ్రయాణాం త్యాగోనన్యతా

పరమాత్మ నొక్కనినే తప్ప మరియొకదాని నాశ్రయింప కుండుటయే అనన్యత్వ మని చెప్పబడును.

## ౧౧. లోకవేదేషు తదనుకూలాచరణం తద్విరోధిషూదాసీనతాచ

లోక సంబంధమైనట్టియు, వేదసంబంధమైనట్టియు వ్యవహారములందు ఆ భక్తికి అనుకూలమైనవానిని ఆచరణయందు పెట్టుకొనుటయును, ప్రతికూలమగు వానియందు జోక్యము కలిగించుకొనక పోవుటయును కూడ అని తెలియవలెను.

## ౧౨. భవతు నిశ్చయదార్ఢ్యా దూర్ధ్వం శాస్త్రరక్షణం

భక్తియందు దృఢనిశ్చయము కలిగినమీదట కూడ, శాస్త్ర రక్షణ మావశ్యకము - అనగా శాస్త్రములలో సాధకుని

కొరకై చెప్పబడిన నియమములను పాలించుచునే యుండ వలయును.

## ౧౩. అన్యథా పాతిత్య శంకయా

లేనియెడల సాధనదశయందు సాధకుడు పడిపోవుట జరుగ వచ్చును. విషయములయందలి వైరాగ్యమును వదలి, విష యానుభవలోలుడై పోవుటయే పతనము. కాన వైరాగ్యమును కాపాడుకొనుటకై, భక్తిశాస్త్రములు విధించిన నియమము లను సతతము పాలించుకొనుచుండ వలయును.

## ౧౪. లోకోఽపి తావదేవ భోజనాది వ్యాపార స్త్వాశరీరధారణావధి

లోకమునకు సంబంధించిన వ్యవహారములును, శాస్త్ర నియమములును భక్తియోగమునందు ఆరూఢత్వము సిద్ధించు వరకే- అనగా పరమ ప్రేమస్వరూపమైన రాగాత్మికాభక్తి కలుగువరకే. కాని, భోజనాది వ్యాపారములు మాత్రము

ప్రారబ్ధకర్మ ప్రకార మెంతకాలము శరీర ముండునో అంత వరకును ఉండును.

## ౧౫. తల్లక్షణాని వాచ్యంతే నానామతభేదాత్

మహర్షులయొక్క వివిధాభిప్రాయముల ననుసరించి భక్తి యొక్క లక్షణములు వివరింపబడుచున్నవి :

## ౧౬. పూజాదిష్వనురాగ ఇతి పారాశర్యః

భక్తి యనగా భగవంతుని పూజించుట, నమస్కరించుట, సేవచేయుట మొదలగు విషయములందుగల అనురాగమే అని వ్యాసభగవానుల అభిప్రాయము.

## ౧౭. కథాదిష్వితి గర్గః

భగవంతుని దివ్యలీలలను సంబంధించిన కథలను చదువుట యును, వినుటయును మొదలగువానియందు గల అనురాగమే భక్తియని గర్గమహర్షి యొక్క అభిప్రాయము.

### ౧౮. ఆత్మరత్యవిరోధే నేతి శాండిల్యః

ఆత్మానందమునకు విఘ్నము కలుగకుండ ప్రవర్తించుటయే భక్తియని శాండిల్య మహర్షియొక్క అభిప్రాయము *

### ౧౯. నారదస్తు తదర్పితాఖిలాచారతా తద్విస్మరణే పరమవ్యాకులతేతి

నారదుని అభిప్రాయమైతే, తన సమస్త కర్మలను పరమాత్మకే సమర్పించుటయును, భగవంతు డొక్క క్షణమాత్రము మరపునకు వచ్చినను, అపరిమితముగ విలపించుటయును భక్తియని.

### ౨౦. అస్త్యేవ మేవం

భక్తియొక్క స్థితి ఇట్లేయుండును.

### ౨౧. యథా వ్రజ గోపికానామ్

బృందావనములోని గోపికలకు కృష్ణ పరమాత్మయందు ఇట్టి ప్రేమయే ఉన్నది- అనగా, గోపికలకు ఎట్టిప్రేమ ఉన్నదో అట్టి ప్రేమయే భక్తియొక్క స్వరూపమని భావము.

---

* ఇచ్చట ఎంతో రహస్యార్థమున్నది.

## ౨౨. తత్రాపి న మాహాత్మ్యజ్ఞాన విస్మృత్యపవాదః

కృష్ణపరమాత్మయందు అంత అపారమైన ప్రేమ ఉన్న స్థితిలోకూడ, గోపికలకు ఆయనయొక్క మహిమ విషయమున విస్మృతి కలుగలేదు; ఆయన భగవంతుడే అను జ్ఞానము వారికి కలదు.

"నీవు యశోద బిడ్డవె సరోజనేత్ర! సమస్త జంతు చే
తో విదితాత్మ రక్షకుడవు తొల్లి విరించి నుతించి లోక ర
క్షావిధ మాచరింపుమని సన్నుతిసేయగ సత్కులంబునన్
భూవలయంబు గావ నిటు పుట్టితి గాదె మనోహరాకృతిన్!"
అని గోపికలే చెప్పిరి గదా!

## ౨౩. తద్విహీనం జారాణామివ

ఆ గోపికలకు కృష్ణుడు భగవంతుడే అనెడి విశ్వాసమే లేకుండినచో, వారిప్రేమ, వ్యభిచారిణులైన స్త్రీలకు తాము వలచిన జారులయందుండు ప్రేమవంటిదే అయ్యెడిది. వారి

ప్రేమ అట్టిదికాదు. వారు భగవంతుడనియే శ్రీకృష్ణుని ఆశ్రయించిరి.

## ౨౪. నాస్త్యేవ తస్మిం స్తత్సుఖ సుఖిత్వమ్

ఆ ప్రేమాత్మికా భక్తియందు తమ ప్రియుని సుఖమే తమ సుఖము. అంతియేగాని తమ సుఖమునందు ఏమాత్రమును స్పృహాయే ఉండదు. గోపికల ప్రేమయందు ఏమాత్రమును స్వార్థము లేదు.

శ్రీమన్నారదభక్తి సూత్రములు

ప్రథమాధ్యాయము



ఓం శ్రీ పరమాత్మనే నమః

# శ్రీనారద భక్తిసూత్రములు

## ద్వితీయాధ్యాయము

### ౧. సా తు కర్మజ్ఞానయోగేభ్యో ప్యధికతరా

ఆ భక్తి యజ్ఞయాగాది కర్మలకంటెను, జ్ఞానసాధనములకంటెను, ప్రాణాయామాది యోగములకంటెను శ్రేష్ఠతరమైనది. కనుకనే గీతలో శ్రీకృష్ణపరమాత్మ :

"తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున !
యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః"

అని సెలవిచ్చియున్నారు.

## ౨౬. ఫలరూపత్వాత్

పిలయునగా, భక్తి ఫలస్వరూపమయినది. దీని కిదియే ఫలము. భక్తునకు భక్తికంటె వేరు ఫల మేమి కావలయును? భక్తుడు ముక్తినిగూడ తృణప్రాయముగ త్రోసివేయును. కర్మ జ్ఞాన యోగముల ఫలము లన్నియును, ఈ భక్తిలోనే ఇమిడి యున్నవి. ఎన్నో జన్మములలో చేసిన కర్మయోగ తపస్సులచేత పాపములన్నియును పోగా, మానవునకు కృష్ణభక్తి కలుగును.
"అనేకజన్మ సాహస్ర తపోధ్యానసమాధిభిః
నరాణాం క్షీణ పాపానాం కృష్ణేభక్తిః ప్రజాయతే".

## ౨౭. ఈశ్వరస్యాప్యభిమాన ద్వేషిత్వా ద్దైన్య ప్రియత్వాచ్చ

పరమాత్మ అభిమానమను గుణమును ద్వేషించును. దైన్యమను గుణమును ప్రేమించును. కనుక పరమాత్మకరుణ పొందగోరిన మానవుడు సర్వాభిమానములను వదలివేయవలయును. 'నేను ధనవంతుడను' అనెడి ధనాభిమానమును, 'నేను విద్యావంతు

డను' అనెడి విద్యాభిమానమును, 'నేను బ్రాహ్మణాది కులము లను చెందినవాడను' అనెడి కులాభిమానమును, 'నేను బలసిన వాడను, చిక్కినవాడను పొట్టివాడను, నల్లనివాడను, సౌందర్యవంతుడను' ఇత్యాది దేహాభిమానమును పూర్తిగా త్యజించవలయును. ఇట్టి అభిమానములు కలవారు పరమాత్మకు అప్రియులు. అట్టి అభిమానములను వీడి, తన నొక గడ్డిపోచ కంటెను కూడ తక్కువ వానినిగా తలచుకొనుచు, ఎవరు సర్వకాల సర్వావస్థలయందును పరమాత్మునొకనే భజించుచుండునో, వానినే ఆయన ప్రేమించి, వశ్యుడగుచుండును. అట్టి వాడే కృతకృత్యుడనబడును.

## ౨౮. తస్యా జ్ఞానమేవ సాధన మిత్యేకే

పరమాత్మయందు ఇట్టి భక్తి కలుగుటకు జ్ఞానమే సాధనమని— అనగా జ్ఞానమువలనగాని భక్తి కలుగదని — కొందరి అభిప్రాయము.

## ౨౯. అన్యోన్యాశ్రయత్వ మిత్యన్యే

భక్తి జ్ఞానములు రెండును, ఒకదాని నాశ్రయించుకొని

ఇంకొకటి యుండునని– అనగా జ్ఞానమునకు భక్తి, భక్తికిజ్ఞానము ఆశ్రయములని పరిగణించుట అభిప్రాయపడుచున్నారు.

## ౩౦. స్వయం ఫలరూపతేతి బ్రహ్మకుమారః

బ్రహ్మకుమారుడైన నారదుని అభిప్రాయము–ఇట్టి ముఖ్యభక్తి దానికదియే ఆశ్రయము, దానికదియే ఫలము. దానికి వేరొక ఆశ్రయమేదియును అక్కరలేదు.

## ౩౧. రాజగృహభోజనాదిషు తథైవ దృష్టత్వాత్

## ౩౨. న తేన రాజపరితోషః క్షుధాశాన్తిర్వా

ఇందుకు దృష్టాంతములుగ రాజు, గృహము, భోజనము, మొదలైనవి కనబడుచున్నవి. ఒకడు రాజును గురించి బాగుగా తెలిసికొనినాడు - గొప్పదాతయనియును, దయాస్వభావుడనియును, జ్ఞానమున్నది. కాని, రాజానుగ్రహమును పొందవలయునన్నచో, రాజుగారిని దర్శించి సేవించవలయునా లేక కేవలము ఈ జ్ఞానమే రాజానుగ్రహమును ప్రసాదింపగలదా? అట్లే గృహమును చేరవున్నను, గృహ

మును గూర్చిన జ్ఞానమే ఎండవానలనుండి రక్షించగలదా? ఆకలి తీరవలయునన్న భోజనమును ఎట్లు తయారుచేయుట, అది భుజించిన ఏమి లాభము కలుగును - ఇత్యాది జ్ఞానము చాలదు; స్వయముగ భుజింపవలయును.

ఈ దృష్టాంతములద్వారా భగవద్గుణానుభవ రూపమయిన భక్తియే భగవదనుగ్రహ ప్రదము, భగవదనుభవప్రదముగాని, కేవలము జ్ఞానము ఫలవంతము కాదని నారదులవారి నిశ్చయముగా తెలియవలసియున్నది. కావున భగవంతుని సర్వభావములతోను భజింపవలయును. అప్పుడు దుఃఖము నాటు మాయమై, సదా సర్వత్ర భగవదానందమే అనుభవమునకు వచ్చును.

## ౩. తస్మాత్సైవ గ్రాహ్యా ముముక్షుభిః

కావున ముముక్షువులైనవారు - అనగా జనన మరణ రూప దుఃఖసాగరమునుండి దరిజేరగోరువారు - పరమప్రేమరూపమైన భక్తినే ఆశ్రయించవలయును. భక్తిచేతనే మానవుడు తరించవలయును. ఇంతకంటె గత్యంతరము లేదు.

శ్రీమన్నారద భక్తిసూత్రములు

ద్వితీయాధ్యాయము



ఓం శ్రీపరమాత్మనే నమః

# శ్రీమన్నారద భక్తిసూత్రములు

## తృతీయాధ్యాయము

### ౧. తస్యాస్సాధనాని గాయన్త్యాచార్యాః

జగదాచార్యులై భక్తిసంప్రదాయ ప్రవర్తకులైన మహాత్ములు ఈ ప్రేమాత్మికా భక్తిని పొందుటకు తగిన సాధనముల నుపదేశించుచున్నారు.

### ౨. తత్తు విషయత్యాగా త్సంగత్యాగాచ్చ

ఇట్టిభక్తిని వృద్ధి చేసికొనవలయునన్నచో విషయములన్నింటిని త్యజించవలయును. అన్ని విషయములతోను సంబంధమును కూడ వదలుకొనవలయును.

"విషయాన్ ధ్యాయత శ్చిత్తం విషయేషు విషజ్జతే
మమాను స్మరత శ్చిత్తం మయ్యేవ ప్రవిలీయతే"

అని శ్రీ భాగవతములో పరమాత్మ చెప్పియున్నాడు.

## ౩. అవ్యావృత్త భజనాత్

ఎడతెగని భజనచేయవలయును. మనస్సు ఎప్పుడును నిర్వ్యాపారముగా నుండదు. స్వేచ్ఛగా వదలిపెట్టినయెడల విషయములమీదికి పరుగెత్తుచుండును. కాన దానికి ఎడతెగకుండ భగవన్నామమును సంకీర్తన చేయు పనిని అంటకట్టవలయును. ఆయన కల్యాణగుణములనుగూర్చిన విచారణలో మగ్నము చేయవలయును. ఆయన దివ్యకథలను వినుటయందో, పఠించుటయందో లీనము చేయవలెను. ఇవి అన్నియును భజనమే. ఏదోఒకరీతిని మనస్సుచేత ఎడతెగనిభజనము చేయించినయెడల భక్తికలిగి వృద్ధిలోనికి వచ్చును. సిద్ధపురుషునికి అఖండభజనము సహజము. సాధకుడు అభ్యాసము చేయవలయును. ఎవనికి తప్పక భగవత్ప్రాప్తి కావలయుననెడి తీవ్రకాంక్షగలదో, వాడు తప్పక అఖండభజనము చేయవలయును.

## ౪. లోకేఽపి భగవద్గుణ శ్రవణ కీర్తనాత్

ఇంకను అట్టి భక్తికొరకై పాటుపడునట్టి ప్రజలతో కలసి,

భగవద్గుణములను, దివ్యగాథలను, ఆయన గుణవాచకములగు నామములను వినుటయును, సంకీర్తన చేయుటయును, భక్తిని పెంపొందించును. అందుచేతనే "హరిభక్తులతో భజనము చేయుచు ఆడిపాడవే ఓ మనసా!" అని చెప్పబడినది.

## ౩౮. ముఖ్యతస్తు మహత్కృపయైవ, భగవత్కృపా లేశాద్వా

యథార్థము నాలోచించినయెడల, మానవునకు అట్టి అనన్య భక్తి లభించుటకు ప్రధానసాధనము మహాత్ముల కృపయే. మహాత్ముల అనుగ్రహముచేతగాని, భగవంతుని యనుగ్రహము చేతగాని భక్తి లభించగలదు.

## ౩౯. మహత్సంగస్తు దుర్లభోఽగమ్యోఽమోఘశ్చ

మహాత్ముల సాంగత్యము దొరకుట చాలదుర్లభము. అట్టి మహాత్ములు తటస్థించినను అభిమానపూరితులు తెలిసికొనలేరు. కావున అగమ్యమనియు చెప్పబడినది. తెలిసికొని ఆశ్రయించ

కలిగినయెడల అమోఘము - అనగా ఆ సాంగత్యము అపరిమిత ఫలదాయకము; ఎప్పుడును వ్యర్థకాదు.

"సత్సంగతిః కథయ కిం నకరోతి పుంసాం"

'సాధుసాంగత్యము మానవులకు ఏమేమియును చేయలేదు!' సమస్తమును చేయగలదని భావము.

## ౪౦. లభ్యతేపి తత్కృపయైవ

మానవుల కట్టి మహాత్ముల సాంగత్యము లభించుట కూడ భగవత్కృపచేతనే.

## ౪౧. తస్మింస్తజ్జనే భేదాభావాత్

భగవద్భక్తులగు మహాత్ములకును, భగవంతునకును భేదము లేదు. కనుకనే భగవానులు శ్రీభాగవతములో

"సాధవో హృదయం మహ్యం సాధూనాం హృదయం త్వహం
మదన్యం తే నజానంతి నాహం తేభ్యో మనాగపి" (౯-౪-౬౮)

'సాధులు నా హృదయము, సాధులయొక్క హృదయము నేను. వారు నాకంటె ఇతరము నెరుగరు. నేను వారికంటె ఇతరము నెరుగను' అని చెప్పియున్నారు.

## ౯. తదేవ సాధ్యతామ్ తదేవ సాధ్యతామ్

తరించకోరిన మానవుడు ఈ లోకములో సాధించతగినది మహాత్ముల సాంగత్యమొక్కటే. అదితప్ప ఇంకేదియును మానవుని సంస్కరింపలేదని నొక్కి చెప్పుటయే రెండుమార్లు ప్రయోగించుటలోని భావము.

## ౧౦. దుస్సంగ స్సర్వథైవ త్యాజ్యః

మానవుని తరింపజేయుటకు మహాత్ముల సాంగత్య మెంత బలీయమైనదో, నరకము పాలుచేయుటకు దుస్సహావాసమూ అంత బలీయమైనది. కావున మానవుడు సర్వవిధములచేతను దుస్సాంగత్యమును దూరముగా పరిహరించవలయును.

## ౧౧. కామ క్రోధ మోహ స్మృతిభ్రంశ బుద్ధినాశ సర్వనాశ కారణత్వాత్

ఏలయన దుస్సాంగత్యము - అనగా విషయలోలురతోటి సహవాసము - కామమును, క్రోధమును, మోహమును, కలిగించుటేకాక, తెలిసిన ధర్మముకూడ మరచిపోవునట్లు

చేసి బుద్ధినాశనమును, చివరకు సర్వనాశనమును కూడ కలిగించును. ఐహికముగాని, పారమార్థికముగాని, దుస్సహవాసముచే ఎందరు చెడిపోయిరో, చెడిపోవు చున్నారో. ఉదాహరణములు కొల్లలు. నిత్యమును అనేకములు కనబడుచునే ఉన్నవి. అట్టి వానిని గూర్చి ఉదాహరణములు చూపవలెనా? నిప్పులో చేయిపెట్టిన కాలు ననుటకు ఉదాహరణమెందులకు?

## ౧౨. తరంగాయితా అపీమే సంగాత్ సముద్రాయంతి

దుస్సహవాసమునకు అలవాటుపడిన యెడల అది మంచివారికి కూడ కామక్రోధాది దుర్గుణములను కలిగించును. ఆ దుర్గుణములు మొదట తనకు తెలియకుండగనే చిన్న చిన్న తరంగములవలె బయలుదేరి చివరకు సముద్రములవలె పెరిగి పోవును. కావున మానవుడు సర్వవిధముల ప్రయత్నించి దుస్సాంగత్యమును ముందుగ పరిహరింపవలయును.

## ౧౩. కస్తరతి కస్తరతి మాయాం ?
## యస్సంగం త్యజతి యో మహానుభావం
## సేవతే నిర్మమో భవతి

మాయను ఎవడు తరించును ? ఎవడు తరించును ? నారదుల వారే ప్రశ్న వేసికొని, ఆయనయే సమాధానము చెప్పుకొనుచున్నారు. ద్విరుక్తి మాయయొక్క దుస్తరత్వమును సూచించుటకే. ఎవడు భగవత్ సంబంధమును తప్ప తదితర సంబంధములు పూర్తిగ వదలుకొనునో, ఎవడు పరిపూర్ణ వైరాగ్య యుక్తుడై, పరమాత్మానుభవమునందు మునిగి తేలుచుండు మహాత్ములను ఆశ్రయించి సేవించునో, ఎవడు మమకారము లేనివాడో-

## ౧౪. యో వివిక్తస్థానం సేవతే, యో
## లోకబన్ధన మున్మూలయతి, నిస్త్రైగుణ్యో
## భవతి, యో యోగక్షేమం త్యజతి

ఎవడు సాంసారిక జనుల బాధలులేని ఏకాంతప్రదేశమును ఆశ్రయించునో, ఎవడు లోకబంధములను త్రెంపుకొనునో,

ఎవడు సత్త్వ రజస్తమో గుణములకు లోబడక, గుణాతీతు డగునో, తన యోగక్షేమములను చూచువాడు భగవంతుడే అను దృఢవిశ్వాసము కలిగి, వాటికై తా నెంతమాత్రమును ప్రయత్నించక ఉండునో -

## ౧౫. యః కర్మఫలం త్యజతి, కర్మాణి సన్న్యస్యతి తతో నిర్ద్వంద్వో భవతి

ఎవడు ప్రారంభదశలో కర్మఫలములను త్యజించి, తరువాత కర్మలను గూడ పరిత్యజించునో, ప్రాపంచిక సంబంధమయిన సుఖదుఃఖాది ద్వంద్వములు లేనివాడో -

## ౧౬. యో వేదానపి సన్యస్యతి కేవల మవిచ్ఛిన్నానురాగం లభతే

ఎవడు చివరకు వేదములను గూడ - అనగా శాస్త్రములను గూడ - పరిత్యజించి, కేవలము సచ్చిదానంద ఘనస్వరూపు డైన సనాతన పూర్ణబ్రహ్మమగు కృష్ణునియందు తైలధారవలె

అవిచ్ఛిన్నమైన ప్రేమాత్మికా భక్తిని పొందునో - "అత్యంత భక్తియుక్తానాం నశాస్త్రం నైవచ క్రమః"అని కలదు కదా !

## ౧౭. స తరతి స తరతి లోకాం స్తారయతి

వాడు తరించును; వాడు తరించును;- ఇట్లు రెండుమార్లు చెప్పుట ప్రమాణముచేసి చెప్పుటను, అత్యాదరమును, ఆనందాధిక్యమును తెలుపును- వాడు తరించుటేకాక అట్టివాడు లోకమును కూడ తరింపజేయును.

శ్రీమన్నారద భక్తిసూత్రములు

తృతీయాధ్యయము



ఓం శ్రీపరమాత్మనే నమః

# శ్రీమన్నారద భక్తిసూత్రములు

## చతుర్థాధ్యాయము

### ౧. అనిర్వచనీయం ప్రేమస్వరూపం

ప్రేమయొక్క స్వరూపము నిర్వచించుటకు అలవికానిది. సామాన్యముగ మానవులు సతీ సుత ధనాదులయందుండు మోహమునే ప్రేమయందురు. అది భ్రాంతియేగాని, యథార్థముకాదు. ప్రేమ యనునది ఒక్క పరమాత్మను గూర్చినదే. కనుకనే ప్రేమకును భగవంతునకును అభేదము. పరమాత్మ స్వరూపమెట్లు అనిర్వచనీయమో, అట్లే ప్రేమ స్వరూపము కూడ అనిర్వచనీయము.

### ౨. మూకాస్వాదనవత్

మూగవాడు అతిమధురమైన పదార్థమును భుజించినప్పుడు

దాని మాధుర్యమును వాడు అనుభవించుటే తప్ప, వాగ్రూపమున ఎట్లు చెప్పలేడో, అట్లే ఈ ప్రేమ స్వరూపము కూడ స్వానుభవమున తెలియదగినదే గాని, ఎవరును ఏవిధమునను వివరించుటకు సాధ్యపడదు.

## ౩. ప్రకాశ్యతే క్వాపి పాత్రే

ఇట్టి ప్రేమతత్త్వము అనేక వేలమంది మానవులలో ఏ ఒక్కని యందో మాత్రమే ప్రకాశించును. కనుకనే భగవానుడు గీతలో :

“మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః”

అని వచించియున్నాడు.

## ౪. గుణరహితం కామనారహితం ప్రతిక్షణ వర్ధమాన మవిచ్ఛిన్నం సూక్ష్మతర మనుభవరూపం

ఈ ప్రేమాత్మికా భక్తి స్వరూపమునే వివరించి చెప్పుచున్నారు -

ఇది ప్రకృతిగుణములైన సత్త్వరజస్తమోగుణములకు అతీతమైనది. ఇందు కోరికలకు తావేలేదు. ప్రతిక్షణమును వృద్ధి పొందుచునే యుండును. దానిని ఏ విఘ్నములును అడ్డగించలేవు. గంగానది తనకు అడ్డమువచ్చిన కొండలనన్నిటిని ఛేదించుకొని ఏ ఆటంకములునులేక ఎట్లు తన గమ్యస్థానమును చేరుచున్నదో, అట్లే ఈ ప్రేమయును. కనుకనే అవిచ్ఛిన్నము; సూక్ష్మతరమైనది - దీనియొక్క స్వరూపము గుర్తించుట చాలకష్టము. కేవలము అనుభవ రూపముననే యుండును.

### ౫౫. తత్ప్రాప్య తదేవావలోకయతి తదేవ శృణోతి తదేవ భాషయతి తదేవ చింతయతి

ఇట్టి ప్రేమాభక్తి కలిగిన మహాత్ముడు పరమాత్మను పొందిన పిదప వానినే చూచుచుండును; వానినే వినుచుండును; వానినిగూర్చియే సంభాషించుచుండును. వానినిగూర్చియే చింతించుచుండును. అట్టి మహాత్మునకు సర్వము వాసుదేవుడే.

## ౫౬. గౌణీ త్రిధా గుణభేదా దార్తాదిభేదాద్వా

ప్రేమాత్మికాభక్తి కేవలము ముఖ్యభక్తి. అది కాక, గౌణ భక్తియని ఒకటి కలదు- అది రెండవ తరగతి. ఈ భక్తి కూడ కొంతకాలమునకు క్రమేణ ముఖ్యభక్తిగ మారగలదు. ఈ గౌణభక్తులు సత్వరజస్తమోగుణ భేదములను బట్టియు, ఆర్తుడు, జిజ్ఞాసువు అర్థార్థి అను భేదములను బట్టియు మూడువిధములు.

## ౫౭. ఉత్తరస్మా దుత్తరస్మాత్ పూర్వ పూర్వా శ్రేయాయ భవతి

వీనిలో తామసభక్తికంటె రాజసభక్తి గొప్పది. రాజస భక్తికంటె సాత్వికభక్తి గొప్పది. ధన కనక వస్తువాహనాది కామ్యముల కొరకై భక్తిచేయు వానిని అర్థార్థి యందురు. వానికంటె జిజ్ఞాసువు గొప్పవాడు. జిజ్ఞాసువు అనగా పరమాత్మ అనగా నెవడు? ఎట్టిలక్షణములు కలవాడు? - ఇత్యాది విషయములను తెలిసికొన నిచ్ఛగించువాడు. వాని కంటె ఆర్తభక్తుడు గొప్పవాడు. ఆపద కలిగినప్పుడు, దానికి తట్టుకొనలేక రక్షణార్థము భగవంతుని ఆశ్రయించువాడు.

## ౮. అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ

తరించుటకొరకై శాస్త్రములందు అనేక మార్గములు వర్ణింపబడియున్నవి. అవి అన్నియును, సాహాయములును, కష్టసాధ్యములునుకూడ నైయున్నవి. మిగిలిన అన్నిటికంటెను భక్తి కడు సులభమైనది. పరమాత్మకూడ భక్తి సులభుడు- "భక్తి సులభో మాధవః".

## ౯. ప్రమాణాంతర స్యానపేక్షత్వాత్ స్వయం ప్రమాణత్వాత్

ఈ భక్తి పరమశ్రేయస్సును కలిగించుటకు వేరొక సాధనమును అపేక్షించదు- అనగా ఇంకొక సహాయమేదియును భక్తికి అక్కరలేదు. అది తనకుతానే ప్రమాణమైయున్నది.

## ౧౦. శాంతిరూపాత్ పరమానంద రూపాచ్చ

ఇంకను దుఃఖనివృత్తి రూపమైన శాంతియే స్వరూపముగా కలిగియుండుటయును, పరమానందమే స్వరూపముగా కలిగియుండుటయును భక్తికి ముఖ్యలక్షణములు.

## ౧౧. లోకహానౌ చిన్తా నకార్యా నివేది తాత్మ లోక వేదత్వాత్

అట్టి ఉత్తమ భక్తిని పొందిన మానవునకు లోకధర్మము లేవియు ఉండవు. అవి ఆచరించక పోవుటచేత వచ్చెడు ప్రత్యవాయము ఏమియును లేదు. కావున వానివిషయములో, ఎవరును లోక ధర్మహానిని గూర్చి విచారించరాదు. లోక ధర్మములనగా తల్లిదండ్రులు, భార్య, సుతాదులు- ఇట్టి వారి గూర్చి తనబాధ్యతలను నిర్వర్తించుకొనవలయును అను ఇట్టి ధర్మములు - ఈ ధర్మములతో వానికి పనిలేదు. ఏలయన లోకమునకును, శాస్త్రములకును సంబంధించినసమస్త విధులను, తననుకూడ సర్వభావములతో ఇదివరకే పర మాత్మకు సమర్పించుకొని ఉన్నవాడు కావున అతనికి బాధ్యత లేవియు ఉండవు.

## ౧౨. న తదసిద్ధౌ లోకవ్యవహారో హేయః కింతు ఫలత్యాగ స్తత్సాధనంచ కార్యమేవ

అట్టి ఉత్తమభక్తి సిద్ధించనంత వరకు మాత్రము, లోక

ధర్మములను విడువరాదు. ఫలాభిలాషను మాత్రము విడిచి ధర్మములను ఆచరించి తీరవలయును.

## ౧౩. స్త్రీ ధన నాస్తిక, వైరి చరిత్రం నశ్రవణీయం

ఉత్తమభక్తిని సాధించ ప్రయత్నించు మానవుడు, స్త్రీల చరిత్రలను వినరాదు. ఎందులకనగా స్త్రీలచరిత్రలను వినిన కొలది విచారించినకొలదిని, వాని చిత్తములో విషయ తరంగములు ఉత్పత్తిల్లి చెలరేగును. స్త్రీలచరిత్రలు అనగా సీత, దమయంతి, అనసూయ, సావిత్రి మొదలగు సతీమతల్లుల చరిత్రలును, గోదాదేవి, మీరాబాయి, సక్కుబాయి మొదలగు మహాభక్తురాండ్ర చరిత్రలను అని ఇక్కడ అర్థము చేసికొనరాదు. అట్టి పతివ్రతామతల్లుల, భక్తురాండ్రు చరిత్రలుకూడ లోకోద్ధరణ సమర్థములు. ఇక్కడ విషయ సంబంధములే ప్రధానముగాగల స్త్రీలని అర్థము. ధనమును గూర్చికూడ వినుటయును, విచారించుటయును కూడదు. నాస్తికుల చరిత్రములను విరోధుల చరిత్రములనుకూడ

వినరాదు. వీనిలో ప్రతిఒక్కటియును, చిత్తమును పాడుచేయు టకు సమర్థము లైనవి. కావున వీని నన్నిటిని పూర్తిగ పరిత్యజించవలెను.

## ౧౪. అభిమాన దంభాదికం త్యాజ్యం

*అభిమానము, దంభము మొదలైనవి పూర్తిగా వదలిపెట్ట వలయును. దంభము మొదలైనవి అనగా గీతలోని పదునారవ అధ్యాయమున చెప్పబడిన అసురగుణము లన్నియును పరిత్యజించ వలయునని అర్థము.

## ౧౫. తదర్పితాఖిలాచారస్సన్ కామక్రోధాభి మానాదికం తస్మిన్నేవ కరణీయం

కామక్రోధాదులను జయించలేని యెడల, నీ సమస్త భారములను పరమాత్మకే సమర్పించి, ఈ కామక్రోధాదులను వాని యందే చూపుము. అట్లు ఉపయోగించి తరించిన వారనుకలరు.

---

* అభిమానమనగా రెండవ అధ్యాయములో మూడవ సూత్రమున విపులముగా చర్చించ బడినది.

"కామోత్కంఠత గోపికల్ భయమునన్ కంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్
ప్రేమన్ మీరలు భక్తినేము నిదె చక్రిం గంటి మెట్లైన ను
ద్దామ ధ్యానగరిష్ఠులైన హరి చెందన్ వచ్చు ధాత్రీశ్వరా !"

అని నారదులవారే ధర్మరాజుతో చెప్పి యున్నారు.

## ౬౬. త్రిరూప భంగ పూర్వకం నిత్యదాస నిత్యకాంతా భజనాత్మకం ప్రేమ కార్యం ప్రేమైవ కార్యం

త్రిగుణములను జయించి, నిత్యము దాసునివలెను, పతివ్రత యగు భార్యవలెను, భక్తుడు భగవంతుని ప్రేమించి భజించ వలెను. మానవుడిట్టి అవిచ్ఛిన్నమైన ప్రేమనే సాధించ వలయును. రెండుసార్లు చెప్పుటలో అభిప్రాయము ఇదివరకు చెప్పినట్లేయని గ్రహింపవలయును.

శ్రీమన్నారద భక్తిసూత్రములు

చతుర్థాధ్యాయము



ఓం శ్రీపరమాత్మనే నమః

# శ్రీమన్నారద భక్తిసూత్రములు

## పంచమాధ్యాయము

### ౧. భక్తా ఏకాంతినో ముఖ్యాః

ఏకాంతభక్తులు - అనగా ఎవరు భగవంతునికంటె అన్యమేమియును ఎరుగరో "జానామి న త్వాం వినా" అనియును "కృష్ణా త్పరం కిమపి తత్త్వ మహం న జానే" అనియును చెప్పినట్లు, ఎవరికి సర్వమును వాసుదేవుడో అట్టివారు- భక్తులందరిలో శ్రేష్ఠులు. వీరిభక్తియే అత్యుత్తమభక్తి.

### ౨. కంఠావరోధ రో మాశ్రుభిః పరస్పరం లపమానాః పావయన్తి కులాని పృథివీంచ

అట్టి మహాభక్తులు పరస్పరము కలుసుకొని, తమలో తాము గద్గదకంఠములతో, గగ్గురుపాటులతో, ఆనందాశ్రువులతో,

భగవద్విషయములనుగూర్చిన స్వానుభవములను ముచ్చటించుకొనుచుందురు.

"మచ్చిత్తా మద్గతప్రాణాః బోధయంతః పరస్పరం"
అని గీతలోకూడ చెప్పబడి యున్నది. ఇట్టి మహాభక్తులు తమ తమ వంశములనేగాక, సమస్త భూమండలమునుకూడ పవిత్రమొనర్తురు.

## ౩. తీర్థీకుర్వన్తి తీర్థాని సుకర్మీకుర్వన్తి కర్మాణి సచ్ఛాస్త్రీకుర్వన్తి శాస్త్రాణి

వీరు ఏ యే తీర్థముల త్రుంకులిడుదురో ఆయా తీర్థము లన్నియును ఉత్తమతీర్థము లగును. వీరు కర్మలను సత్కర్మలుగా చేయుదురు. శాస్త్రములను సచ్ఛాస్త్రములుగా నొనర్తురు. అనగా వీరు వానిని ఆశ్రయించి పవిత్రులు కావలసినదిలేదు- అవియే వీరి సంపర్కముచే పవిత్రములై ఉత్తమత్వమును పొందును.

## ౪. తన్మయాః

ఏలయన - వారు తన్మయులు. అంతేగాక భగవత్తేజస్సుతో

నిండియుండును కాన భగవత్స్వరూపులే. ఇనుపగుండు అగ్నిలో ఎఱ్ఱగా కాలి, ఎట్లు అగ్నియే అగుచున్నదో, అట్లే వారు కూడ భగవత్స్వరూపులే అగుచున్నారు.

## ౭౧. మోదంతే పితరో నృత్యన్తి దేవతాః సనాథా చేయం భూర్భవతి

ఇట్టి మహాభక్తులు అవతరించిన వంశములు ధన్యములు. వారి పితరులు "ఇంక మనము తరించితిమి, తరించితిమి" అను కొనుచు బ్రహ్మానందమున మునిగిపోవుదురు. దేవతలు సైతము చేతులు పైకెత్తి నృత్యముచేయుదురు. ఈ భూమికూడ అట్టి వారిచే దిక్కు కలదిగా అగుచున్నది.

## ౭౨. నాస్తి తేషు జాతి విద్యా రూప కుల ధన క్రియాదిభేదః

భగవద్భక్తులలో ఇతడు బ్రాహ్మణుడు ఇతడు ఛండాలుడు అనిగాని, ఇతడు విద్యకలవాడు, ఇతడు విద్యలేనివాడు అనిగాని, ఇతడు సౌందర్యవంతుడు, ఇతడు సౌందర్య

హీనుడు అనిగాని, ఇతడు గొప్ప కులమువాడు, ఇతడు తక్కువ కులమువాడు అనిగాని, ఇతడు ధనవంతుడు, ఇతడు ధనహీనుడు అనిగాని – ఇట్టి భేదములు లేవు.

## ౭. యతస్తదీయాః

ఏలయన – భక్తులందరును ఆయనవారే; కనుక వారిలో భేదము లేదు.

## ౮. వాదో నావలంబ్యః

ఇట్టి భక్తిని సంపాదించుటకై ప్రయత్నించువారు పరస్పరము ఆనందముతో భగవద్విషయములను చెప్పుకొనుచు ఆనందించుచుండవలసినదేగాని, వాదోపవాదములు చేసికొనరాదు. వారిలో వారికే వాదోపవాదములు పనికిరావని చెప్పగా, ఇంక విశ్వాసహీనులతోను, నాస్తికులతోను వాదోపవాదములు చేయవచ్చునా? ఇట్టి వాదములతో నైవారు బాగుపడరు. సాధకులు చెడిపోవుదురు.

## [illegible]. బాహుల్యావకాశత్వా దనియతత్వాచ్చ

వాదము బుందలోని ఉక్కుస్తంభమువంటిది. ఎవరు బలముగా లాగిన వారివైపు వంగును. వాదము హద్దుపద్దు లేకుండ పెరిగిపోవుచునే యుండును. వాదము, వాదముచేయు వారి బుద్ధిబలముమీద ఆధారపడియుండును. వాదముచేత ఇప్పుడు నిర్ణయింపబడిన సిద్ధాంతమును, కాలాంతరమందు ఇంతకంటె బుద్ధిమంతుడు ఖండించివేయవచ్చును. కాన వాదమునకు పాల్పడరాదు.

## ౧౦. భక్తి శాస్త్రాణి మననీయాని
## తత్బోధ కర్మాణి కరణీయాని

భక్తినిగూర్చి బోధించు శాస్త్రములను - అనగా శ్రీమద్రామాయణము, శ్రీ భాగవతము, శ్రీ భగవద్గీత మొదలగు సద్గ్రంథములను - నిత్యము పఠించుచు, అందలి విషయములను బాగుగా మననము చేయుచుండవలెను. భక్తి వృద్ధి పొందుటకై ఆయా గ్రంథములలో చెప్పబడిన కర్మలను ఆచరించుచుండ వలయును.

## ౧౧. సుఖదుఃఖేచ్ఛా లాభాది త్యక్తే కాలే ప్రతీక్ష్యమాణే క్షణార్థమపి వ్యర్థం న నేయమ్

సుఖదుఃఖములు, లాభాలాభములు, కోర్కెలు మొదలగు ద్వంద్వములతో ఏమాత్రము సంబంధములేని అతీతావస్థ ఎప్పుడు లభించునాయని, ఆ సమయముకొరకు ఎదురు చూచుచుండవలయును. ఒక అర్ధక్షణమైనను వ్యర్థముగా గడుపక, ప్రయత్నించుచునే ఉండవలయును.

## ౧౨. అహింసా సత్య శౌచ దయాస్తిక్యాది చారిత్ర్యాణి పరిపాలనీయాని

ఉత్తమభక్తిని పొందగోరు సాధకుడు అహింస, సత్యము, శౌచము, దయ, ఆస్తిక్యము మొదలగు ధర్మములను చక్కగా పరిపాలించవలయును.

## ౧౩. సర్వదా సర్వభావేన నిశ్చింతై ర్భగవానేవ భజనీయః

సర్వకాల సర్వావస్థలయందును, సర్వభావములచేతను, ఏ ఇతర విచారములును లేక, నిశ్చింతతో భగవంతునే భజించవలయును.

## ౮౪. స కీర్త్యమాన శ్శీఘ్రమే వావిర్భవ త్యనుభావయతి భక్తాన్

భగవంతుడు సంకీర్తనము చేయుబడినవాడై, శీఘ్రముగ సాక్షాత్కరించును. సంకీర్తనముచేయు తన భక్తులను బ్రహ్మానందములో ముంచి వేయును.

## ౮౫. త్రిసత్యస్య భక్తిరేవ గరీయసీ భక్తిరేవ గరీయసీ

భగవంతుడు త్రిసత్యుడు - అనగా భూతభవిష్యద్వర్తమాన కాలములందు సత్యమైనవాడు. భగవంతునియందలి భక్తియే శ్రేష్ఠమైనది. ఈ భక్తియే శ్రేష్ఠమైనది.

## ౮౬. గుణమాహాత్మ్యాసక్తి రూపాసక్తి పూజాసక్తి స్మరణాసక్తి దాస్యాసక్తి సఖ్యాసక్తి వాత్సల్యాసక్తి కాన్తాసక్తి ఆత్మనివేదనాసక్తి తన్మయాసక్తి పరమవిరహాసక్తి రూపైకథా ప్యేకాదశథా భవతి

భక్తులయొక్క సంస్కార భేదములనుబట్టియు. రుచిభేదము లనుబట్టియు, భగవంతునియందలి ప్రేమ పదునొకండు విధములుగ కనబడుచున్నది :

౧. భగవంతుని గుణములయందును, ఆయన మహిమయందును గల ప్రేమ ;

౨. ఆయనయొక్క అప్రాకృత దివ్యమంగళ విగ్రహము నందుగల ప్రేమ ;

3. ఆయనను పూజించుటయందలి ప్రేమ ;

౪. ఆయనను స్మరించుటయందలి ప్రేమ ;

౫. ఆయనకు దాస్యముచేయుటయందలి ప్రేమ ;

౬. ఆయనతో సఖ్యముచేయుట యందలి ప్రేమ ;

౭. పరమాత్మను చిన్నిబిడ్డవలె భావించి సేవచేయుట యందలి ప్రేమ ;

౮. తాను పరమాత్మకు భార్యనని భావించి ప్రవర్తించుట యందలి ప్రేమ ;

౯. తనను తాను ఆయన పాదములయందు సర్వార్పణము చేసికొనుటయందలి ప్రేమ ;

౧౦. తన్మయత్వమును పొందుటయందలి ప్రేమ ;
౧౧. ఆయనతో అక్షణక్షణమైనను వియోగమును సహింపలేని ప్రేమ ;

ఈ విధముగ భక్తియొక్క బాహ్యరూపము పదునొకండు విధములుగా నుండును.

౮౩. ఇత్యేవం వదన్తి జనజల్ప నిర్భయాః ఏకమతాః కుమార వ్యాస శుక శాండిల్య గర్గ విష్ణు కౌండిన్య శేషోద్ధ వారుణి బలి హనుమద్విభీషణాదయో భక్త్యాచార్యాః

అజ్ఞులయొక్క దూషణలను లక్ష్యముచేయక భక్తిసంప్రదాయాచార్యులైన సనత్కుమారుడు, వ్యాసుడు, శుకుడు, శాండిల్యుడు, గర్గుడు, విష్ణువు - ఈయన ఒక ఋషి - కౌండిన్యుడు, శేషుడు, ఉద్ధవుడు, ఆరుణి, బలిచక్రవర్తి, హనుమంతుడు, విభీషణుడు మొదలగువారందరును, ఏకాభిప్రాయులై ఈ విధముగానే వచించిరి - అనగా పైన వివరించిన విధముగానే భక్తిస్వరూపమును వచించిరి.

౮౪. య ఇదం నారదప్రోక్తం శివాను
శాసనం విశ్వసితి శ్రద్ధత్తే స భక్తిమా
న్భవతి స ప్రేష్ఠం లభతే, స ప్రేష్ఠం
లభత ఇతి

నారదప్రోక్తమైనట్టియును, కళ్యాణప్రదమైనట్టియును ఈ ఉపదేశమును ఎవరు శ్రద్ధావిశ్వాసములతో అనుష్ఠింతురో వారు ప్రియతముడైన పరమాత్మను పొందగలరు. తప్పక పరమాత్మను పొందగలరు.

శ్రీమన్నారద భక్తిసూత్రములు

పంచమాధ్యాయము

సంపూర్ణము



జయతు జయతు దేవర్షి ర్నారదో జయతు జయతు!

విజయతే శ్రీకృష్ణ సంకీర్తనం !



కాయేన వాచా మన సేంద్రియైర్వా

బు ధ్యాత్మనావా ప్రకృతే స్స్వభావాత్

కరోమి యద్య త్సకలం పరస్మై

నారాయణా యేతి సమర్పయామి !

